సీ. దొండకెమ్మోవి నీ ♦ దండకు చిలుకలు
జేర మేల్పొదవులఁ ♦ జెప్పవేల
నల్లమబ్బు కీల్గంటు ♦ నమిలి పులుంగుల
జేరి చిందులుద్రొక్క ♦ జెప్పవేల
యసలుపుట్టుఁగుకంటి ♦ వెసతెలిపిట్టల
జేరి మేల్నడకలఁ ♦ జెప్పవేల
చిగురాకుబోడి నె ♦ చ్చెలిమి కోగిలగుంపు
జేరి మేల్స్వరములఁ ♦ జెప్పవేల

గీ. విరియఁబారిన నీరజాది ♦ విరుల పొగడ
పొన్నగేదఁగిమల్లియు ♦ మొల్ల జిలుఁగు
గన్నెరులపూల సోగుల ♦ కారుకొరు
మొగుల కీడఁగు కీల్జడ ♦ ముడువవేల. ౯౦

సీ. రంగుమేలిమి మేన ♦ బంగరుసొమ్ములు
బెట్టక నీ విట ♦ బెదరనేల
చిన్నిమొగంబున ♦ వన్నెకస్తురిఁబొట్టు
దిద్దక నీ విల్లుఁ ♦ ద్రిక్కుటేల
కుతుకసారంబున ♦ కుతికెలఁ బడవీనె
సారెలగీటవు ♦ సరమదేల
తియ్యన కమ్మనఁ ♦ దేరిన నుడువుల
మాటోడ నుకువక ♦ మసలనేల

గీ. గందమును వచ్చకప్పుర ♦ మంచి ముగను
చేయు దమ్ముల నక్కున ♦ జేర్పవేల
లేచి పూపొదరిండ్లలో ♦ లేను తొఁగల
మేలుగా గూడి నడువవి ♦ దేలఁ గోల. ౯౧

ఉ. ఓరుచు కొమ్మగోఁడు లెద ♦ నొయ్యన పూవులమాలె లక్కనన్
చేరుచు కొమ్మలో దలఁపు ♦ చెల్వుపుచేడెల కెల్లఁ దెల్పెడిన్
దారిచి పూలవిల్తునకు ♦ దక్కనకారులఁ జెప్పి నిల్వఁగా
నేరుపు జాలకున్న విను ♦ నెవ్వగలు గ్మని నుందువో చెలీ. ౯౩

క. ఇటువంటి గుట్టు లున్నను
కటకట మాతోడఁ జెప్ప ♦ కను నీ విప్పుడె
చ్చటనైన నుండుదానవొ
తటుకున వివరింపవమ్మ ♦ తళుకులబోఁటీ. ౯౪

తే. గీ. అనిన తా విని తలవంచు ♦ కొని యొయారి
కాలు చిటికెనవేల్ గోర ♦ నేల వ్రాయు
చును కనుఁగవను కన్నీరు ♦ చనులదంట
కొప్పారంబులఁ బడఁగ నా ♦ కొనె మఱుంగు. ౯౫

ఉ. చక్కెరవింటివాని పెలుచ ♦ న్గెలువన్ దగు గట్టుఁ దాల్పరిన్
జొక్కులుమీరునట్టి నుడి ♦ చొప్పులఁ జెప్పి బిరాన వాని నా
చక్కికి వచ్చునట్లుఁ గను ♦ సయ్యన జేసెదనంచు నేగిరా
దక్కను తుంటవిల్తు బలు ♦ దాడికి గుందితి నెట్టులో చెలీ. ౯౬

తే. గీ. అందలేనట్టి ప్రమానుపం ♦ డంపబోవు
మాడ్కి కలుముల పడఁతికి ♦ మగఁడనంగ
వెలయు ముప్పొకలానినే ♦ విరిలకోరు
కాని పోరున గవయుఁగఁ ♦ బూనుకొంటి. ౯౭

తే. గీ. ఎవరు నాకోర్కి దీర్ప మ ♦ ఱేఁగగలరు
ఎవరి వేడుదు నిచ్చట ♦ నేలికైన
చెలిమి చేడియ మిన్నగు ♦ చెలువ పద్మ
నియిటఁ గలిఁగిన నాకును నెమ్మి పొసఁగు. ౯౮

వ. ఇట్లు నెచ్చెలియలతో కుబ్జ వాకొనుచున్నంత కలికి గోనంబులు గలుఁగు చంద్రముఖి యను మెలఁత యిట్లనియె. ౯౯

ఉ. సాటివలంతులీ వలపు ♦ సాగిన బెంగను బెట్టు కుందు రే
తోఁటను ద్రిమ్మరిల్లుతరి ♦ తొందరలుం బడు వారలుందు రే
మాటికి మాటికిన్మరుని ♦ మామనుపుల్గులఁ గాడ్పుఁజూచి యా
రాటము డెందమందిడప ♦ రాకిది గల్గకఁ బోవుబెట్టులక్కా. ౧౦౦

శా. ఔనే యెంతలుఁ దెచ్చుకొంటివిక నా ♦ హా యేమనన్వచ్చు నీ
కీనేలన్ జతమైన జవ్వనులులే ♦ రే వారలీ వింతలౌ
వైనంబు న్వినవిన్న నవ్వెదరు తే ♦ వన్నెగిరంబుం గొనన్
గానాయంబునుఁగాదు నూరుకొనుమా ♦ కన్నయ్యతో తెంచెదున్.

ఆ. వె. అనుచు వలపుమీరు ♦ నతివెకు మేలైన
నుడులు కొన్నినుడివి ♦ యుడుకు దొలఁగ
జేసి మెలఁగిరచట ♦ చెలఁగి కన్నయ్యకై
తరలిబోవు నవల ♦ తారుఁడాక. ౧౦౧

వ. నట్లు ముగుదలు వినిపించిన వూఁదోటలో కన్నయ్యవలపులం బడి దిరుగుచుండె. నిచ్చోట దేవకికొడుకు కుబ్జ ముచ్వంక లెగయఁజేసి కమ్మచ్చు పోసినబంగారు తీఁగమాద్రి నలరారు కన్నెక నెగాదిగ కన్నుల పండుగుగాకనుం గొనునది మొదలు జగము తండిరడెందంబు తామరపాకున జలకంబు లాకునంటక చెదరాడువగ కమ్మవిలుకాని పువ్వుటమ్ములకు సొమ్మసిల్లి యుల్లంబు తల్లడిల్ల నన్నతోనున్న సకులతో రాచదారిం బోయిపోయి విలుగీముఁదరి యంజొచ్చి సురతాణివింటి కై వడి పెద్దదియై బీరముగల మగలకు దాల్పుటకు ద్రవేఁకమై యలరారుచున్న సింగాణికి యచ్చటిపజలు వలదువలదనంగ నారిమోపెట్టి ఖణిల్ ఖణిల్ మనునాదు నలుదెసలఁచెలరేగ రెండుగండ్రికలుఁ గావించె. అత్తుండంబు లన్నదమ్ము

లుచేగొని నచ్చోటి కాపరిపజలు వజీరులు గరువించి చుట్టుముట్టిన మట్టుఁబెట్టి రాచకొలువునకు జనుచుండుఁద్రోవ కువలయాపీత మను నేనుంగును యశోదకుఱ్ఱనిఁ బరిమార్పుటకై నిలువ నయ్యేదిమ స్తి గలిగి మావంతునంకియకు నిలిచె నంతకుముందు కనకతప్పెట గుమ్మటకై ముడి నగరతుడుము మొదలగు చప్పుడులచే మ్రోగు చుండునదియు చాణూరుఁడును ముష్టికుండు నరిష్టుఁడు మొదలు మల్లడించెడుకొలంబుచేతఁ దిండ్రించునదియును కప్పురమువునుఁగు జవ్వాదిమెలాక వూనీరుకలిపి దుమారము లేవకుండునట్లు చేసి నదియు బొడిపిరాళ్లు వయ్యాలు మిట్టపల్లంబులు పుట్టలుగోలె లే కుండునట్లు కోమలికంబుగా నుంచినదియు పడగజెండాలు పువ్వుల మాలెలతో బురణింపసేసినదియు నేలవేలుపులు రాచలు కోమ టులు నాలవకొలంబువారు నన్నికొలంబుల వారితో మ్రోగు చున్న నొంటియడుగు కత్తెరనేలకుం వెన్నుండన్నతో నరుఁగు చుండ రాచమిత్తలు పురికొల్ప మదపుటేనుఁగు బరికొని యానచే నెదురించిన వెన్నుం డిట్లనియె. ౧౦౩

తే. గీ. ఓరియేనుఁగు గాచెడు ♦ కారుచదుగ
మాదెసకు నేగుదెంచుట ♦ మంచిదటర
మరలఁగాజేసి బ్రతుకుము ♦ మరలవేని
తప్పదిక చావునీకు పె ♦ త్తనముచేత. ౧౦౪

చ. అనవిని మావటీడు మురు ♦ వారఁగమీదికి ద్రోలినం గనుం
గొని మొలహొన్నుకాసె నల ♦ కొప్పును బిగ్గఁజేర్చి వెన్నుడున్
గసలుచు తొండమంది నడి ♦ కారము నొప్పపజల్ వినంగనం
దుని మెరు పల్లవన్ బెరికి ♦ తోడ్పడువాడు బలారెయంచనన్. ౧౦౫

వ. ఇట్లు గజ్జెనుఁగునుం బరిమార్చి దాని నిడుదలై తెల్లనై యలరారు రెండుపళ్లను బెరికి చేపట్టి రాముండును కృష్ణుండును మావటిని

బీరముఁగల పజలను రాచవారిదంటను మట్టుబెట్టి వచ్చుచుండ
తోటిరాచ లిసుప్రక్కలం గూరిచుండి పలువిధంబుల మాటలాడు
చుండనొక్క పెద్దమంచెయందలి తళతళమను మాతావిం గూర్చిన
పట్టుతివాసి యందుపైన జిల్లేడదూది పరుపు కూరుపులుదిండ్ల
యెత్తుగా మెత్తపలకై నతికించిన దానియందు బససేసి మంతినగవు
మొగము తేటను లోనరించిన తప్పొప్పులెల్లఁ జెప్పి పాటిమిగిన మంచి
చెడ్డలు వినుపించుచుండ నంది ముద్దుకుం కరిష్టాంచు చాణూరుండు
మొదలగువారున్న యెడ మనువు పనుపు నేలను కుప్పింప పెనువెల్లి
కరిని మద్దిగంబుల పంపు దండాదనివిచిన ముత్తెముత్తె గొంగల
తెరంగున నప్పళింత సేయుచు తాలికి నెత్తువచ్చు గాపులతో నెత్తు
రుగ్రక్కఁగను గవలతో నన్నల సద్దపాటు లేకుండ పచారంబు సేయు
చున్నవారిం దరియుం జొచ్చి గట్టు గట్టువోలెక కోల్పులి కోల్పుల
మాదిరి యెనుగు నేనుంగు చందంబున సింగంబు సింగంబుతీరు రెట్టి
బలిమిగల బలిమికాండ్రఁబట్టి మిట్టిపడుట పట్టుదలయోయని కేలున
కేలుఁగీలించి కాలుకాళులం జొనిపి పడదిగిచి పెచ్చియూర్చిన నయ్యి
ద్దరు గద్దనపిడుతిపక పిడికిటి బొడుపులకున్ జెదరని నొడవగలిఁగి
యోరసారించి తెరలక మూరల పోరలంద్రొచ్చిన వెన్నుండు తనయొ
డలు తొండంబులబోలు కేలుదండలసాచి మగరాలపలె కటికెత్తనం
బుగలదాయ నొడలి పిడికిట విడువక పొడుచుచు నడుగులం బట్టి
నాయంబు తప్పక నడుగిడుచు నడుగులం బట్టి ముష్టాస్తరం డ్రిప్పి
నేలపై జరిచిన మోములనుండి నెత్తురుల గ్రక్కుచు జెజెల పట్టుం
జేరం జనిరి. నత్తఱిం రోహిణీకొడుకు నట్లే యొనర్చిన జగంబులెల్ల
గొనియాడ నందుడు మొదలు కొలువువారందఱు కంసుని పరపరఁ
గూరుచొని చూచుచుండిరి తరువాత నిమిషించి యా కటికతోఁ దెచ్చి
కొండసారంగంబు పీడిన సింగంబు చందంబున కఱటిపజలను తెగ

టార్చి కన్నయ్య సింగంపుపీటపై మల్లులు తనను కారియబెట్టక నికరంబు వదిలి సూచుచున్న కంసునిగాంచి యుబ్బ బ్బా యీదుండగీడు నా కొరకు నా తల్లితండ్రుల కారంజేర్చి రాచలచ్చిమి పెనుద్రేకను దాల్చుటకై తండిరియగు నుగ్రసేనుని చెరసాలనుండి తన యిచ్చతీరినట్లు దిరిఁగెనని దాపుంజేరి బొమిడికంబుపై కేలు దమ్మిఁ జేర్చితిగిచిదలవెండ్రుకలంబట్టి నేలకీడ్చిన వాడంతకు ముందె కన్నయ్య రూపునుగాంచినంతనె నుత్తినబెదోచి మోము డంబంబుదప్పి తేజాలేకనుండె నతని ముట్టినంతనె నసువులవీడి వినువీడు సుగంబు జూడంబోయె వానితమ్ములును జరాసంధుకు పల్గాకి పజల నైదుకొని కాలయవనుండును తురుక యేతెంచి ముట్టడించిన కయ్యంబున తీసుపాటుగావించి మధురనువదిలి సందరంబుతో ద్వారకయను పేరిటితో రాచనగరు గావించి నందు సుగంబున్నె భోజకాలంబునకు ప్రలియగు నుగ్రసేనునికి మరలి రాచలచ్చిమిని కట్టించె తన తల్లిదండ్రుల చెరవిడిపించి సుగంబుండ నొక్కనాడంతిపురిని మెత్తని సెజ్జపై బరుండి కుబ్జ చేడియ కనుదమ్ములఁ గట్టినట్లైన కన్నయ్య. ౧౦౬

సీ. క్రాల్గంటి మేటి సిం ♦ గారంబు వలపోయు
జవరాలు రూపు న ♦ చ్చనుగ నిలుపు
చిలుకలకొల్కి మ ♦ చ్చిగ మాటలో నెన్న
కన్నియ కోమలి ♦ కము దలంచు
తెలిగంటి వగటు నా ♦ ద్దికతోడఁ దూఁకొను
కప్పురగంధి చ ♦ క్కదన మెంచు
వలఁతి మేన్వాలపుల ♦ వరుసనుఁ గొనియాడు
పోఁగకన్నుల మది సొక్కుదలఁచి

గీ. మగువ తిన్నని మోము తా ♦ మర మిటార
మునకు మెచ్చును మాటలు ♦ పొంతనమున
కెడద సంతోసమందు విం ♦ దేర్పడంగ
లచ్చి మొగడిట్లు తలఁపు త ♦ లంచియుండె. ౧౦౭

క. తొలఁగున్దడబము చెచ్చె
మొలఁగున్గదు చందిరికను ♦ మేల్ మేలనుచున్
కలగున్మరుని తలంపున
కలగు న్మెన్పడక జేర్చి ♦ యలసట నొందున్. ౧౦౮

వ. చెఱుకువిల్తుండొఱ బెఱికి గఱకఱిగాక కఱుకు మెఱుఁగు గొరకల కఱఁద దూరనాటినఁ బసచెడి దనయింటి చేరువకుఁ వేరువడక సారువలుఁగల పూఁదోఁటలో సారెసారెకు దిరిగాఁడు మరుని వారువముల పారువముల గొరువంకలతో రాగిల్లు పూవులకోవుల మావుల తీవియలనుఁ జూచి కళవళింపుచు నొక రాయబారి నంపుటకు తలంపుసేయు నంతలో కుబ్జవెలందితో యానొంది యేతెంచిన పద్మిని రాణివాసంబున కాసంతైన కన్నయ్య జాడ తెరుంగక తోడి ప్రోడలకు విడియంబులొసంగి పోడిమిగల వేడుకల నాడుచు తెరువెఱంగె. ౧౦౯

తే. గీ. అంత పద్మిని నాచెలి ♦ యలరువిల్తు
తండ్రికడ కేగుదెంచి వి ♦ తాకునొందు
చెలువ వక్కాణమంతయుఁ ♦ జెప్పుటకును
కేలుమోడిచి యిట్లు న ♦ గ్గించె బగితి. ౧౧౦

(కందగీత గర్భ చంపకమాలా వృత్తము)

కడు॥ కఱివేలుపా। గవురు। కన్నఱ। కానలగాలిమిత్తన
ల్గడ। దవురా। మసన్మగులు గచ్చునికౌమొయి ముర్వ కాడప్రే।

ముడి। నెఱితో। నెదందలఁతు। ముప్పరిపోకల తారువాడ పాల్।
కడలి బసా। జగా గొనము। గైకొని బ్రోవుము కోర్కెలూరఁగన్॥

క. కఱివేలు పాగవురుక
న్నఱకానల గాలిమిత్ర ♦ నల్లడదవురా
నెఱితో నెదం దలఁతు ము
ప్పఱిపోకల తారువాడ ♦ పాల్కడలి బసా. ౧౧౨

గీ. గవురుకన్నఱ కానల ♦ గాలిమిత్ర
మొగులు గప్పువి కౌమె యి ♦ ముర్వకాడ
దలఁతు ముప్పరిపోకల ♦ తారువాడ
గొనము గైకొని బ్రోవుము ♦ కోర్కెలూర. ౧౧౩

(చతుర్విధకందగర్భ ప్రమితాక్షరవృత్తము)

నెలఁబ్రొద్దుకన్నుఁగవ ♦ నిగ్గులమై
కొలఁబ్రుబ్బుపైరగురి ♦ గొట్టెలమిన్
గలనీరు వామియిలు ♦ గల్గు లలీ
నలవేల్పనే గొలుతు ♦ నాకలిమిన్. ౧౧౪

(ఇందు ప్రతిచరణమాదిగా చతుర్విధకందములు జనించు)

గ. ప్ర. కం. నెలఁబ్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలఁబ్రుబ్బుపైర ♦ గుఱిగొట్టెలమిన్
గలనీరు వామియిలు గ
ల్గు లలీనలవేల్పనే గొ ♦ లుతు నాకలిమిన్. ౧౧౫

గ. ద్వి. కం. కొలఁబ్రుబ్బు పైరగురి గొ
ట్టెలమింగలనీరు వామి ♦ యిలుగల్గు లలీ
నలవేల్పనే దలఁతు నా
కలిమిన్నెల బ్రొద్దుకన్నుఁ ♦ గవ నిగ్గులమై. ౧౧౬

గ. తృ. కం. గలనీరు వామియిలుగ
ల్లు లలీనలవేల్పనే గొ ♦ లుతు నాకలిమిన్
నెలప్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలప్రమబ్బు పైర ♦ గురిగొట్టెలమిఁక. ౧౧౭

గ. చ. కం. నలవేల్పనే గొలుతు నా
కలిమి న్నెల ప్రొద్దు కన్నుఁ ♦ గవ నిగ్గులమై
కొలప్రమబ్బు పైర గురిగొ
ట్టెలమింగల నీరువామి ♦ యిలు గల్లులలీ. ౧౧౮

(చతుర్విధకందం)

గ, ప్ర. కం. వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి ♦ వాడిమి నెసగన్
బెరసుపజజదిపి యెలమిని
విరివిని ససిబుడమి కిచ్చి ♦ వెలఁగితివి సరిన్. ౧౧౯

గ. ద్వి. కం రుసిగమిని బ్రోచి వాడిమి
నెసఁగన్ బెరసుపజజదిపి ♦ యెలమిని విరివిన్
ససిఁ బుడమి కిచ్చి వెలఁగితి
విసరిన్ వరుస మనిచితివి ♦ వెసదేవరలన్. ౧౨౦

గ. తృ. కం. బెరసు పజజదిపి యెలమిని
విరివిని ససిబుడమి కిచ్చి ♦ వెలఁగితి విసరిన్
వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి వాడిమి నెసఁగన్. ౧౨౧

గ. చ. కం. ససిబుడమి కిచ్చి వెలగితి
విసరిన్ వరుసమనిచితివి ♦ వెసదేవరలన్
రుసిగమిని బ్రోచి వాడిమి
నెసగను బెరసుపజజదిపి ♦ యెలమిని విరివిఁ. ౧౨౨

(మత్స్యబంధము, భద్రికావృత్తము)

రార కన్నయ మాటిమాటికీ
కోరిఁ జేరితిని మేరగా
గారవించి కొలఁదిఁ ద్రోలఁగా
మేరయారయెద నెంతురా. ౧౨౩

(ఖడ్గబంధం, సుగంధివృత్తము)

ఏటిబోటి మేటిలోన ♦ నిక్కనిక్క చక్కఁగా
గాటమైన సీటిబంటు ♦ గట్టుదారి యేలికా
కాటిజేతుబమ్మఁ గొల్వ ♦ కల్మలిచ్చి బ్రోవఁగా
గాట మిచ్చు నీటిచాగి ♦ కాహళారంగుమైచొకా. ౧౨౪

(మర్దళబంధము, మావకణవృత్తము)

మేలుగడించుము సాలున్
గ్రాలఁగ పక్కిమామాయిన్
మేలుగ నెక్కి మసారిన్
చాలఁగ బ్రోచెదమా-రా. ౧౨౫

(కూర్మబంధము జలదవృత్తము)

కారడి మేల్ మెఱుంగు మెయి ♦ కన్నయ సిం
గారపు హారమున్నకోక పర ♦ గన్వెనుకన్
దారవెదాయల న్మెఱుప ♦ దాఱుజగా
మేరలుపాముకన్దపులి ♦ మెల్పడుకో. ౧౨౬

(కుండలిబంధం, ఉత్పలమాలావృత్తము)

బంగరునక్కసాలు వలె ♦ వాటు తటుక్కన వెల్గుసామితె
స్సంగలవారు బత్తిమది ♦ సంతసమై లలితారుచు న్మసన్
రంగ నినుం దలంచిరి స ♦ రానరి గచ్చగునున్న చిన్నిటెం
కింగొన బ్రోవుమయ్య గిడి ♦ గిల్పకిలార్చిన లేమచేగమై. ౧౨౭

## దండకము

సీరామవేల్పా బయల్జేజెలుం బమ్మయుంకఱ్ఱంటియుం దుగ్గిజక్కు
లొమ్మొదల్గా జగంబంత నిన్నెన్నఁగాజాలరే కూరునిసేతలుం బత్తులున్మె
చ్చఁగానేయుదెల్లన్న తోఁబ్రూపుమేన్మసులో మిన్నవై చాలఁబ్రాగబ్బ
ముందోఁచుఁబ్రావేల్పునుంబట్టి వాలారుముక్కంటి కోమున్మొదగన్గ్రిమ్మ
యాబొమ్మకున్మేలు నొందంగవేసేసితో వేల్పులుం రక్కసుల్గూడి
పాల్వెల్లిసింద్రచ్చుచో నీటుతామేటిలో మేటివై కవ్వపుంగుబ్బలిన్వీపు
నం దాల్చి జేజేలబువ్వ న్వొసన్దీసియిచ్చంచితో, జాళువాకంటిరాకాసి,
నేలన్వడిన్జుట్టి సంద్రంబులోవైవగా జన్నపుంబందివై వాని మూరా
ముగుర్తించి మన్నిందొలంగించి నీకోరచే నేలలేనెత్తితో, కుఱ్ఱసింబట్టి
చెడ్పాటుగావింపకంబంబు నన్మొదివై సింగమై, క్రందుపాల్మాసిసింబోలి
బామందితోత్వేలుపుం బట్టియుం డొక్కనుంజీల్చి రోసంబుపెల్లారఁగా
రాబ మొప్పంగ దేవళ్లనుంగాచితో, గోచిబాపండవై మూడుపాజ్జల్బ
లిన్వేడి, నీ నేర్పునుంజూపఁగా బొమ్మగ్రుడ్డుంగడున్నిండి మూడజ్జలం
జూపితో చేతిగొడ్డంటమువ్యేదుమూరుల్ నెఱేన్రాయలంగొట్టి యానె
త్తురుం దంద్రికిన్ బిండలిన్వైచి, రాయాదలల్ నూర్చి జేజేలమెల్చక్కి
కిన్ దంతియల్లట్టె పెంపందితో, చాలుగా తెలుగున్వల్గు పేరింటిరా జేసనికిం
బుట్టి రాకాసినింజెండి, జన్నంబునుంగాచి మేల్పాజలంబుట్టు దుబ్బన్గలు
న్నాతిగాఁజేసి యున్నేలచూలిం గడుంబెండ్లియైమించి రాదారిలో కా
వరంగల్గుపాఱున్ గరాళించియున్రోబ్బలునుంజేరి తానయ్యయానన్వడిన్
లంకలోఁజేర సన్నాసులుం బొమ్మచారుల్ నిరాబారులుంగొల్వఁగా
నాకుపాకన్ దగంగొన్ని నాళ్ళుండి యచ్చోటునుంబాసియుం సీతఁగో
ల్పోయి తోఁబుట్టువుం దోడురారుష్యమూకంబుకుంజేరి రేకంటుమేపు
ట్టువుంజూచి నెయ్యంబు నాటించి మ్రానిమ్మరుల్ గొల్వ సంద్రంబుపై
వంతెనంగట్టి రెండైదుతెక్కన్దలల్గల్గు రాకాసినింజంపి వేవానిసైదో

డుసుర్క జేనిగావించి యున్నేలచూలిన్వసంగూడియుం బుష్పకంబెక్కి
దమ్మునుండుసుం గొల్వగా వీటికై వచ్చి సంతోసమున్ మమ్మేతిల్లంగ
చుట్టుండురా రాయలుం గప్పము ల్వెట్ట, పెంపొందియుం బత్తులం బ్రోచి
తౌ, సల్లవల్వన్ మొలందాల్చియుం బైడిచాలాలిబన్వర్క దోలంగిం
పరాకాసిపాలర్క దగంబుట్టు రారాజులం గొంతిమేపుట్టుకల్ బాసటం
గల్లగాఁ ద్రుంచినేలన్ సతంబిచ్చగాదిర్గకన్నయ్య వైచాలఁ గోల్గంటులం
న్నేలవా చాలఁ బ్రోవంగా, నీవు మేల్మేలుగా బుద్ధరూపుంగడుందాల్చి
సర్దారిలో మేటివై దాయలంబోరు సందారునంగెల్వఁగా రావిమ్రా
ల్నొసిలోదూజే ప్రావేల్పు మోమూరులం గొప్పఁగాదప్పులుం లేసి
మేల్ నోములునోచఁగాఁ జేసి యున్వారిబన్నంబులం బెట్టి మువ్వీటిపే
రింటితో ల్వేల్పులం ద్రుంపగా ద్రెంపఁగా జిల్వరాదాల్పుకై బాసటన్
జూపితౌ, తేజిపై నెక్కి యుండాలుమీరంగ చెన్నంటులౌ తేకులం జీల్చి
నాయంబులం బంటవూఁబోఁడిపై నాల్గుపాజల్ వడిన్నిల్పితౌ, నీకడింద్రై
నచెయ్యేల్ దలంపర్క సురిన్నెత్తికై గ్రాలు నిన్నున్మజేన్గొందరున్ వేడ
గున్నేరకన్ దొడ్డుగా బిడ్డలన్గొడ్డులన్, మేడలన్మాడలన్గోడలన్జెడెలన్,
కుఱ్ఱలంబఱ్ఱలం గుఱ్రముల్ గల్గు కల్మల్ తిరింబంచు వేనమ్మి ముత్తింగోనం
లేక నేలన్మజెంబుట్టి చావొప్పఁగా వెండి తాబుట్టుచున్ జచ్చుచున్ దుం
తరాతుండుపట్నంబుకున్ నేలకుండిర్గగా లేక నిన్నెప్డుజోగుల్ తలంపొ
ప్ప జేజేలుతో ల్వేల్పువేఁగంటి చౌఁగంటి రేకంటిమేపుట్టు వాకోసనా
యందు నీర్వామిరాయందు మేల్లేటిబాబాయు కాసెద్దడింగాచు విన్దిరి
మ్మరీడున్ మొదల్ గల్గువారెల్ల విన్కొంపుజాబిల్లియున్ జక్కటుల్పక్క
ముల్పందెలున్గందు వుల్కారులున్వద్దెలు ద్రొబ్బదులున్నెన్కులు న్గబ్బము
ల్గోలె నాబమ్మగ్రుడ్డంత నీవంచు వేగుండి యున్నమిమ్మ నీతావునుంజూచి
వేతారుచుండంగ మెల్నాటికై మేటివై యుండుకన్నయ్య నిన్నెప్డు నీ
చిన్నెలన్దప్పకన్నెంచు నాకన్నెకున్నీదు చెన్నందగన్జూపి కావంగదె
లచ్చితేడా, జగాపక్కిగోడా జొహారుల్ జొహారుల్జొహారుల్జొహారుల్.

చ. సిరిచెలిమించుగా బొమలు ♦ సింగిడిగా బలులోతు సుద్దులో
యురుములుగాఁ జెలంగ జెలు ♦ వొప్పెడినల్లనిమేనుమ
బ్బుని బరికపుసోనలం గురియ ♦ బల్మెరుచేడియవానకోయిలన్
హాయివుఁగ జేరి బ్రోవుము జొ ♦ హారులు వేలకొలంది సేసెదన్.

వ. అనిసంబరంబున నక్కటివేల్పుం జేవగా నగ్గించి తనదేవెరి సుద్దివినం
జెప్పఁ జిలుకపలుకులకు సరుదుఁగల నుడువుల నిట్లనియె. ౧౩౦

సీ. వలవంతకారగ్గి ♦ వలన బుట్టినరోజు
వదలిన కెమ్మోవి ♦ వట్టవార
కాటుక నెరయంగ ♦ కన్గవజలకంబు
కాలువలగుచు చ ♦ న్గవను బాఱ
చెక్కుటఁజేర్చిన చేదమ్మి ♦ కాఁకచే
మోము దామర నీటు ♦ మునుఁగువడఁగ
పలుమారు ననపిల్తుఁ ♦ డలరుతూపులఁ గ్రుమ్మ
కదలనిగుండె చీ ♦ కాఁకుఁగాక

ఆ. వె. నవతమీఱ మోము ♦ సనుచెమ్మటలు వాఱ
తలఁపులోన నిన్నుఁ ♦ దలఁచి తలఁచి
గువ్వగుత్తి కొదవ ♦ కొన్ని మెల్నుడువుల
నిన్నుగూర్చి చెప్పి ♦ సన్నుబంచె. ౧౩౧

సీ. ఇగిరించులే మావి ♦ చిగురులచే సొక్కు
కోయిలఁ జేరునే ♦ కొడిశలకును
మిన్నేటి సీటిలో ♦ మేలుగా దరివెను
యంచలు చేరునే ♦ వెంచలకును
చందురుమామ మేల్ ♦ చంటిరి కనుదిను
యేగునే నెలత్రావుఁ ♦ డివములకును

నీటఁబుట్టుఁగు కమ్మ ♦ నీరుఁద్రావుచు చొక్కు
తుమ్మెదలేగునే ♦ తుమకి గమికి

గీ. నీదుబాగైన యడుగుల ♦ నీరుపుట్టు
వులను నీనవ్వు నీపాట ♦ లలరుటూపు
లందె నాబుద్దినిలిచె నా ♦ కన్నులవయి
నాసఁజేరదు నీయందె ♦ నచ్చియుండె. ౧౩౨

తే. గీ. మున్నుకల్మల ప్రోయాలు ♦ చిన్నిబోర
నిలచి మనవుము నన్నని ♦ నిన్నువేడి
మరల నీ యంజదమ్మల ♦ మరువకెలమి
కొసరి యంజల బుక్కము ♦ గోరెగాదె. ౧౩౩

తే. గీ. వేలుపుల గాఁచుదేవర ♦ వితము నీవు
నిబ్బరంబున నీకేలు ♦ గబ్బిగుబ్బ
దుగలఁ దలపైనిబెట్టినఁ ♦ దొగల బాసి
నేను మనిమొదనేల బి ♦ రానరమ్మ. ౧౩౪

క. నినుఁజూచు కనులతో చ
క్కని వెయ్యువిమైనఁ గాని ♦ కననోడును గ్ర
క్కున నీకని పెంచిన మే
యిని నొరులం జేర్చనొల్ల ♦ దెల్లెడనైనన్. ౧౩౫

ఉ. సింగముఁబోలు నెన్నడుము ♦ చెందొవరాయనిమించు మోము మే
లుంగడకంటి చూడ్కుల ♦ లో జగమంతయునంకె జేయుచున్
బంగరు దువ్వటంబువలె ♦ వాటుగ వేసిహారంగుమీర నా
కుంగనుబడ్డ రూపుకులు ♦ కున్మతిఁ గాంచగ నిచ్చజేసితిన్. ౧౩౬

సీ. మొల్లమొగ్గలసాటి పెల్లగు పల్చాలు
బలుకెంపు మోవిపై ♦ బరువకున్న

వెడలుపుగలబోర ♦ విడి గుబ్బలంటగా
నింపుమై వే కౌఁగిలింపకున్న
నీటి పుట్టుఁగుబోలు ♦ నీ కేలుదుగలను
చెల్వైన కొప్పునఁ జేర్పకున్న
నిబ్బరికవుచూపులుబ్బగ వెల్లనౌ
నెమ్మోమ్ముదమ్మిపై ♦ నిలుపకున్న

గీ. నోర్వగా లేను నాయందు ♦ మురువుమీర
రమ్ము రావేని యిట నీవి ♦ రాళియగ్గి
చేత నీరైన నిన్వేడ్క ♦ జేసి నీదు
నడుగుదమ్ములకడఁ జేరి ♦ యుండగొందు. ౧౩౭

వ. అని యిట్లు కొన్ని నుడికారంబులగు పోలుపొందు తియ్యని నుడు
లచే వాక్రుచ్చి యక్కటికవేల్పుం జూచి వెండియు నప్పద్మిని
యిట్లనియె. ౧౩౮

క. తొయ్యలి వలుపులు హెచ్చిన
కుయ్యిడుచున్నంత మరుఁడు ♦ కు సిగుంపులుఁగా
తియ్యని విల్లందియు వేఁ
కయ్యానికి కాలుద్రవ్వఁ ♦ గా కటివేల్పు. ౧౩౯

చ. నరవిఁగ వెన్నెలంగనిన ♦ జక్కవతీకుకడిందిమ్రుబ్బు పెం
పరసిన తూడుతిండిపరి ♦ నక్కట బెబ్బులిఁగన్న లేఁడిమా
దిరి కడి పూలసెజ్జపయి ♦ తీఁగయెలుఁగున కాఁకునొందెనా
విరిహాదనంపు దొట్రిలెను ♦ వెచ్చలకాకల కోర్వలేమి చేన్. ౧౪౦

క. దక్కినపుఁ గాలి వీఁవఁగ
పక్కులు వగఁగలుఁగ కూయు ♦ వలదొర నెలలున్
స్రుక్కగనేసిరి చీమ చి
టుక్కనిసన్ నీవటంచు డొంకుచు చూచున్. ౧౪౧

మ. అనలుం బుట్టుగుఁజం బయుండె నెల చె ♦ ల్వాకంబొ గల్గిక్కొ డా
ల్పనతెల్మ్రత్తెపుచాలుమై కళుకు మేల్ ♦ బంగారుటీవేము తె
ల్పెసలారెన్ పసలెల్ల కమ్మె మొగవా ♦ యుం దాకగాఁ జుక్క నీ
మనవల్పించిన గాదె హాళదాల వే ♦ మారుం బడెన్గన్న యా. ౧౨౨

క. అని హాళాయలుగ వచ్చెలి సు
ద్దినివినఁగాఁ బలుక నల్లఁ ♦ దేవర యొలమిఁ
బెనగొనగ చెలువతో వా
న్నఁగల నడికారమఁటివి ♦ నంబలికె మనన్. ౧౨౩

ఉ. మాపటి ప్రొద్దుగ్రుంకవిను ♦ మా చెలికానినిఁ గూడి నేడు నే
నా పె బిడారుజేరములు ♦ వారఁగ వచ్చెదనంచు దెల్పుమా
చూపరి పూలవిల్తునకు ♦ స్రుక్కక గట్టితనంబు బూని తా
దూపిలియున్న వద్దునకు ♦ తొయ్యలి మేల్రతినమ్మ గ్రద్దనన్.

క. అని పలికి పోవఁబనిచిన
నసఁబోణికయి నొ్మ్రగిడ్చి ♦ నలమేన్దొరకై
గునపు నగిడి గిల్లిడి గ్ర
ద్దనచెల్మి పడంతియున్న ♦ తావలమునకై. ౧౨౫

ఉ. వన్నె యొయారివచ్చి ♦ చెలునంగని ముందటనున్న తీరులే
కున్న వితాకునొంది కౌఁగి ♦ గొందియు కన్నుల తెప్పవ్రాల్పకే
కన్నియ నెల్లఁ జూచి సర ♦ గన్నరసంగల ముద్దుగుమ్మలన్
బెన్నుడి వక్కణించుమని ♦ వేకువఁజేరిన నందటొక్కపై. ౧౨౬

తే. గీ. వరుస వాకొనిరప్పుడు ♦ వఁగిమిన్న
కరయుఁ జిగురాకు బాకువా ♦ కనేడఁ బూవి
సోక నెదలోన సెకసేరి ♦ స్రుక్కి గోడ
గములపాలయి యదిగోల ♦ కన్నెమిన్న. ౧౨౭

చ. కుడువదు వంటకంబు నెఱి ♦ గొప్పునఁ దావుల పూవుసోఁగల
న్నొడువదు రామతమ్మిలటు ♦ మ్రోలనుఁ జేరిన నాకు సుద్దుల
న్నుడువదు పూఁదోఁపునకు ♦ నుం జెలిమూకలఁ గూడియాఁడఁగా
నడువదు గొప్ప యబ్బముఁలో ♦ నచ్చిన నవ్వది కేమి సేతుమో.

ఉ. విప్పదు లోవలం గలుఁగు ♦ వేసట నెమ్ములకెల్ల చిందులన్
జెప్పదు మోముఁ దమ్మికయిఁ ♦ జేరఁగవచ్చిన తేటి మొత్తము
న్నొప్పదు నీరునుం గొనదు ♦ రోయును కోయిలపాటకుం గను
ల్దిప్పదు నల్లమేనుఁగల ♦ దేవర వచ్చెడు త్రోవఁజూచుటల్. ౧౨౯

క. ఈ రమణ నిదురలేకయె
సారెకు నిటురట్టుసేయు ♦ సొగసుఁ బలుకన్
మారాడదు మముఁజూడదు
పేరిమితో నెపుడునిన్ను ♦ బేర్కొను పడఁతీ. ౧౩౦

క. అని పసఁగుఁజేయు చెలిములు
వినుచు నుడులనాలకించి ♦ పెనుతోయముగాఁ
గనుమారాడక దనపే
రును వినఁబలికినను వీడె ♦ ప్రోయాలు వెఱన్. ౧౩౧

తే. గీ. కన్నుఁదమ్ములఁ దెఱచిన ♦ ల్గడలమిన్ను
నెల్లఁబరికించి యొడ్డలో ♦ నల్లటంబు
నివ్వటిల్లఁగ నచ్చటి ♦ నేస్తపుఁజెలి
మానికంబునుఁ గనుఁగొని ♦ మాటఁబలికె. ౧౩౨

చ. కటకటనన్ను నిట్లునల ♦ కాఁకను సందరమందు ముంచినీ
వెటకుమిటారి యేగితివె ♦ యెక్కుగణిన్ మరులుం దోలంగునె
చ్చటఁజొరుదు న్బిరాననను ♦ సారెకు కౌఁగిలి నీయవెన్నఁడె
న్నటి తరివచ్చునమ్మ విన ♦ నాదగుగంగఁ జెలంగనెల్తుకా. ౧౩౩

ఉ. వెన్నుని చెంతనాకుగల ♦ విన్నదనంబును విన్నవించితో
క్రన్నన నిన్ను నేమనుమనగ ♦ న్విని పల్కకమోన పోతివో
పిన్నది కన్నయట్లు వినుపిం ♦ చితొ నీదగురాయబారమో
యన్నలమిన్నఁ జెప్పఁగదు ♦ నచ్చొటఁగల్గిన వింతయేర్పడన్.

సీ. అని కఱివేల్పు పొం ♦ దున కయివెతలకు
పాదైన కుబ్జనాఁ ♦ బడఁతిఁజూచి
బడ్మని యిట్లనిఁబలికె ♦ కన్నీరుము
న్నీరుఁగాఁ జేసియు ♦ నీటుకాటు
కనుఁగడుఁగఁగ నేల ♦ కడు వేడియూర్పుల
వలన పూసోగులు ♦ వాడె సెజ్జ
బొరలఁగా నేరని ♦ పోడిమి విడనాడి
గబ్బిగుబ్బలఁ బూయు ♦ గందములును

గీ. చెదరిపోడివ్రాలఁ ♦ జెక్కిటఁ జేయిఁజేర్చి
మోముఁ దామరవన్నెలు ♦ మొఱకవడక
చెఱఁగు ముసికిడినిట్టుల ♦ చెల్వ కాని
కొఱకు కుందంగ నేటికే ♦ కొమ్మమిన్న. ౧౩౫

క. అని తానుఁబోయికన్న
య్యనుఁ గన్గొని ముచ్చటాడి ♦ యానతిగొనివ
చ్చిన ముచ్చటంత చెలివా
కొని నెలఁతకుఁ దెలిపెఁబూస ♦ గూర్చిన మాడ్కిన్. ౧౩౬

వ. అంతమచ్చకంటితో నిచ్చగా కొన్ని ముచ్చటల ముచ్చికగా ముచ్చ
టించి మఱియు. ౧౩౭

చ. తెలిసితిఁగాని నీవలపు ♦ తెమ్మరపేఁవ మరుండుకిన్కతో
నలరుల కోరులేయ చెలు ♦ వారగ కోయిలజిల్క సారెపె

ల్లలమటఁ నొందగా రొదలు ♦ హొళిగసల్పగ సైపలేవ్రునీ
చెలువలఁగూడి మేడకిక ♦ జేరఁగఁబోవుఞ్మ పరాకుపొల్గెనో. ౧౩౭

తే. గీ. ఇటుల నేస్తపుచెలిబల్క ♦ యింతి మిన్న
చెల్మిపడఁతుక చేదమ్మి ♦ చేయినమ్మి
నిచ్చిపయ్యెట సవరించి ♦ యొలసుమిూర
నంచనడకల కొయ్యార ♦ మెంచనడచి. ౧౩౯

ఉ. మేడకుఁజేరఁబోయి చెలి ♦ మిన్నలతోఁ గొలువుండు నంతలో
వేడుకకొఁదు నల్లమెయి ♦ వేలుపుకొండొక చేడెఁజీరితా
వేడిమిగొన్న కుబ్జకును ♦ వేళముగానిదె రేయివత్తు నం
చాడినగొలె నంతిపురి ♦ నాయమ పీడియు మిత్తిమించగన్. ౧౪౦

ఆ. వె. వెన్నదొంగమాన ♦ వినివచ్చి కొలువున్న
చెలువకఱుఁదు బుట్ట ♦ చెలిమిగలుఁగ
వేల్పుప్రోడఁజెప్పు ♦ వివరము కొరును
దెలియఁజేసి యేగె ♦ తెఱవమిన్న. ౧౪౧

వ. ఇట్లుఁ దెలియునంత నావగలాడి వగకాసక్తై, మిగుల పగలఁబొగిలి తనలోన. ౧౪౨

ఆ. వె. ఎపుడుఁ బ్రొద్దుగూకు ♦ నెఱచి మేపరిగొంగ
నెపుడుజూతు వలపు ♦ లెపుడు దీర్పు
నెపుడు చందమామ ♦ యే తెంచునో కద
యనుచు పలువితాల ♦ నరయుచుండె. ౧౪౩

వ. అట్టి తోయంబున. ౧౪౪

(సూర్యాస్తమయవర్ణనము)

తే. గీ. వెనుకదెస సీమమేడపై ♦ వేడ్కమిూర
రేవెలందుక మెచ్చతు ♦ రీన పసిఁడి

కుండ సేసియు కొ(ప్రపు ♦ కోనలసుంచె
నోయునంగను చీకటి ♦ చాయ వెలిఁగె. ౧౪౫

క. పడమర కెలఁకుపడంతికి
కడువడితఱి బొజుగు కాఁడు ♦ తలిరుల కెంపుల్
విడివిడిఁ గూర్చిన బంతిని
తడయకఁబంపెనన కలువ ♦ దాయుఁడుఁ గ్రుంకెన్. ౧౪౬

చ. వలకులు నెట్టవాటె చెలు ♦ వంబులు తామరలందుఁ దీరె పు
ల్గులగమి చెట్టజేరె నెల ♦ కూటిపులుంగుల సేఁదేరె బల్
కలువలరోకు మీరె నెల ♦ కల్లులదాటులు నీరులూరె చు
క్కలు తెగ గేరె కమ్మవిలు ♦ కాడులకోరులనూరె న త్తరిన్. ౧౪౭

ఉ. పేరిమి తమ్మి తేనియల ♦ పింపగ వెన్నెసయున్నలంతి సొం
పారినఁ చీరఁదాలిచి యొ ♦ యారపుఁ జేగురువారు కెంపులన్
గూరుచు సొమ్ముఁబెట్టుకొని ♦ క్రొత్తనిజాజుల కొప్పు బెట్టినో
నారహిమీర నేలయెఱ ♦ నైనెఱసందె వెలింగి జొబ్బిలెన్. ౧౪౮

తే. గీ. తుంటవిల్తుండు బొజుగుల ♦ తుటుముగరువ
మణపనన విల్లునెత్తిన ♦ యలరు బెళుకొ
తేరునకుఁ గట్టుచిలుకల ♦ తేటముక్కు
నీటుచాయల నగనొప్పె ♦ నీరుకాల్లు. ౧౪౯

చ. కలువబొజుంగునా తెలిమె ♦ కంబుల రాయఁడు వేడ్కఁ బుట్టుగు
బ్బలిగ వినుండి లేచి తన ♦ వాడివెలుంగగు చేతిగోరులన్
నిలువక చీఁకటేనుఁగును నెత్తినఁ ♦ గొట్టిన (తెల్లి రాలుని
గ్గులుగల ముత్తియంబులను ♦ కోపునచుక్కలు వెల్గె తళ్కునన్.

చ. విరిపిడిఁబాటి గుబ్బలిగ ♦ విన్నెతిరాపులఁ దూటియుండి బి
త్తరమునుఁగల్గు (ప్రొద్దుతురి ♦ తంబున గ్రుంకుడు మెట్టుఁజేరిన

న్పొరిపురివెచ్చ గాండ్రకును ♦ గ్రుముచ్చులకానలుఁ బుట్టఁదట్టఁగా
నిరులట నిక్కిపిక్కటిలె నేప్పడ ♦ నేరకవ్రంత మిట్టుచున్. ౧౯౧

మ. వెలియింతైనను లేక ముజ్జగములుం ♦ పెంజీకటుల్గ్రిమ్మ న
త్తలలోఁనన్ గొమరాండ్రొగిన్మొగలతో ♦ దార్కాణఁగా ప్రూలసె
జ్జలపైఁ గూడి పరుండనేసి మనహో ♦ చ్చున్ మిండఁడంజేరి గ్రం
తలపోయున్మరు చెయ్వులన్మెలఁగియుం ♦ తం బోయి కిల్ జేరఁగన్.

సీ. మరుఁడు దెరవరుల ♦ మది కానలం గాల్ప
కుప్పఁగా నిల్పిన ♦ నిప్పులనఁగ
విటకాండ్రపై దాడి ♦ వెడలెడు వెడరాఁయు
గ్రొల్లైనపై హూన్న ♦ కుండయనఁగ
వలపుకాండ్రను మెక ♦ ములపైన వేఁటాడ
దెచ్చిన ననవిల్లు ♦ దీమమనఁగ
వలతేఁడు వలఁగల ♦ వారిగాఁ తిన్నుతీఁగి
యాలఁ ద్రెంపనెత్తిన ♦ యలరుగుడును

గీ. వాలనఁగ యెట్టదనమయి ♦ వన్నెనున్న
వరలి తేజులఁగలదియై ♦ వట్రువయయి
పొడుపుగుబ్బలి కొప్పుపై ♦ బొడిచెనిండు
బాజు లలరిన చందురు ♦ డోజఁగలిగి. ౧౯౩

ఆ. వె. చందమామ యాక ♦ సము నెక్కఁ దెసలను
వెల్లఁదనముఁ గలుఁగు ♦ వెలుఁగు లేరు
పడియె నలువగ్రుడ్డు ♦ వడిగ నిండినకప్పు
రంబు క్రోవివస గ ♦ నంబడియెను. ౧౯౪

వ. మఱియు నప్పొడుపుకొండనుండి కొమరారుచుండుఁ బుట్టిన వేఁడుకను నాకసము నొరయు తరఁగలచే మమ్మతిల్లు పాలసందరంబు వెల్లివొడిచి పుడమి కడువడి యెల్లెడల నల్లుకొనియెనన నంతకంతకు

తెక్కలేనిదిగ్గియై మెఱిమిడికడల నులుమఁబడి మిన్నేటి సెలయే రులనుండి పైఁడిమూఁకాలి వఱంతికిం దిగ్గురాయుంచల సోఁగుల యూరాదికి తగ్గులేని పుటపుటఁనవిచ్చిన తెల్లఁగలువల గ్రోఁగులుం గల కేళాకూళులు చెంగటను పొదలాడుచు తెలగాముపామిడాను గవియుం గు జొఁచ్చుట యచ్చెసంబునుంబోలె మేడలపొఁపు నుర తాణితనంపు గుంట్రసని కిటికీలందూఱుచు చీఁకటి గ్రోక్కాడు తుద యగుటవలన తెల్లి పెంపారి పూఁచెనోయన విరివిఁగల వెల్లువల నొడ్డులం గ్రాలుచు సనలచాలుల పోలిక నేలపుట్టుఁగుల తీవియల యాకులం దళతళరువాణంబుల వెలయుచు కొఁదమసిం గపు కూఁసలతీరున గ్రొండకొప్రఁబులెక్కుచు మనఁజెలంగ జల కంబునం దేలియాడు వాలుఁగల మేలగు బెళుకులంబోలి సోయ గంబున నందంబుగల పెన్నెటితరగల చెలువారి యలచందిరిక మిక్కిలి గరగరగల తెల్లని చెన్నుగలదియై వెన్నెలపులుంగుల నోట నెరయుచు చందమామసీములోఁ గల తేటివాయినుండి నెమరువేయఁగ జారిన మిక్కిలి మమ్మతిల్లు నురుగుపుంజిక వరుస నేర్పాటుగల పువ్వుటీరంబులపయిం దిరువులాడుచు కమ్మనితావి వెదజల్లెడుననుచు మల్లెపూఁగుత్తుల సంతోసంబు రెట్టింప సిట్టుట్టు తొలుదొల్త కూడికచే నలసి పలపుకాండ్రను సేదదించి పైకూ టమి నెఱుపు తెఱవలఁ సుగుణుజూపుచు న్నరువాణంబుల తెఱం గునన్ కురంగట కరంగి తొరంగు నెఱకల కిట్టడంపు నేల జలజలం జాఱుచుండు వెల్లఁ దసంపుకోటి తళుకుక్కులం గలసి కూడుకొనుచు రింగున న్నెగసి వినుదారికంగారు నేల కొడుకుగాముపగడంపు రిక్కలు గోలెగాములు రిక్కలింగంబులని గుటునను గుటుక్కన మ్రింగ గడంగుతఱి పెద్దగా గుఱియుమనుచు వెల్లువ వరుస నీటి దారకు నింపుగా గుంపులై యాకసంబున కుత్తుకకొలఁది ద్రావి

క్రిక్కిరియన్నాఁయిం బట్టి యొక్కటి కొక్కటి కందిచ్చుచు
విచ్చలవిడిన పచ్చికలం గలయు నెలఁతావుముల నొయ్యారంబును
నాలుమగలు పటికప్రుకోరల నొమ్మనలుంచిన నారికడము కల్లునా
సచే బుచ్చుకొని దాని రిమ్మనలన గలుసుకొన్న సంతోసంబు
సంగడింప వినువారి వీనుల కింపగునటుల బాడు నెక్కువతక్కువ
పాటలచేత డబ్బాటుకూటల వక్కజంబు పొందించు నాటలచే
వంకరలగు రూపుసేతల లలించు వైనములేని చిరునవ్వులం
జెలంగి మెలంగుచు తెలివంటి పరాకువదిలి మరలుఁజెంది నొకరి
కొకరు ప్రేముడిసేయుచు రతనపుటందియలు మ్రోతమ్రోఁయఁగా
పుప్పవు పెద్దతుప్పలకుం బోయి తోటనుండు కమ్మతెమ్మెరలు
వీఁచి, కుతినీపయ్యెదలు దొలంగింపకయున్న జారిపోవ న్పసుపు
పచ్చని నిమ్మకాయలవడుపునం బొంగారు లేకులుకుగుబ్బ గవలం
దళతళలాడునట్లు గాన్పించు సొగసైనపొడ లుబ్బుకొనం దబ్బిబ్బు
లెడలం దబ్బున కౌగిలించు మెఱుఁగుఁబోడుల కన్గవలకొనల గద
లుచున్న మెఱుంగులు రాణించు సింగారపు సేతలకు సంతసించు
ప్రేముఁడి మగలతో పెనుగులాఁడి పలువితంబుల కూటములన్
గల నేరుపులతో చేరి మసునిదురంబున సయ్యాటలాడి తారు
చుండు నప్పుడు సోయగంబుచే తళతళక్కుమని గ్రాలెడు మగ
రాలదుద్దుల పాపెటఁ బొట్టు చకచకలతో చెలిమిసేయుచు నిట్లు
తగ్గులేని తెల్లని చాయుల నింతుకొని మెండుగా పండువెన్నెలలు
గాయుచుండ మరుండు కరంబుగా విరికఱుకుటమ్ముల దురమ్ము
సేయ కినుకారదాయుడై కమ్మతెమ్మెరలుదాయ నుల్లంబు జల్లు
జల్లుమని తల్లడిల్ల సిద్దురనొందక మిగుల మెత్తని జిగురుపాన్పు
నుండి డిగిచెరలాడు పెనుగాలిచే దూలి పూపతీఁగియమాదిరి
సోలుచు కుబ్జకన్నె కపతనంబు సతంబు మంతనంబున తలంపు

సేయు సిరిపెనిమిటియగు కన్నయ్య కొమొదలి సింగారంబు కన్నులఁ గట్టినట్లైనఁ జూచితి చూచితని జ్వరునలేచి బయలుం గౌఁగిలించుచు నది పట్టిదియైన కళవళించుచు నక్కటక్కటా మూల దైవంబు కట్టడియెయ్యె నేనేమి సేయుదు ననుచు కన్నుంగవనుండి జారుచున్న నీరు సెలయై యలర గడగడ వడంకుచున్నంతలోన.

ఉ. అప్పుడు నల్లమేనిదొర ♦ యాటపటోదెకు కుబ్జచెంతకున్
దెప్పునఁబోవఁగాఁ దలఁచి ♦ తీరగుసొమ్ములుఁ దాల్చి మేననీ
టొప్పఁగ యుద్ధవుండనెడు ♦ నొక్క నిమిత్తనిఁ గూడి చేడె మే
లుప్పరిగంబు త్రోవచెలు ♦ వొందగ నాతఁడుఁదియు చుండగన్. ౧౫౯

క. చనిచని కట్టెదురంగను
గొనెమరునిం గన్నతండ్రి ♦ కోల్కొను సారము
ల్దనలారు వీనెవిద్దన్
జిగిరవల వెలుంగుగద్దె ♦ చెలువఁగు మిద్దెన్. ౧౬౦

వ. కనిలోఁ గిలికింజనిన నచ్చేడియ యెదురుఁగా నడచి హారునంబు బుద్దిలో బెనంగొన నక్కటికి వేల్పునంజదమ్ముల వన్నెటి జలకంబు నంగడిగి నన్నని దువ్వలువచే దడియొత్తి నిద్దాబంగరు రతనాల గద్దియపైఁ గూరుచుండబెట్టి వెంబడించివచ్చిన యుద్ధవుండనెడు నేస్తకానికిఁ దగిన పూజలొనరించి దురబండులు మొదలగు మేలోగిరంబుల సాపడంబెట్టి నెచ్చెలులతో నచ్చెలువ యారగించి మరియు, ౧౬౧

క. జవ్వాది కప్పురపుకడి
నివ్వటిలం జెమ్మెలందు ♦ నెఱివివ్వలతో

మవ్వముఁగల పడుకఁగదిన్
జివ్వన కరివేల్పుతోడఁ ♦ జేరెఁజెలువయున్. ౧౫౯

వ. ఇట్లు నప్పడుకఁగది మ్రోలకరిగి వెండియు, ౧౬౦

చ. పగడపుకోళ్ల మంచమును ♦ బల్కులతి నీపనిమించు పాన్పుపై
నిగనిగలాడు దోమతెర ♦ నిక్కఁగ చక్కని నిల్వుటద్దము
ల్సొగసగు ముత్తెలుఁజ్వెకుల ♦ నూదినిచందువ ముత్తియంపుచే
ర్లుఁగలిగి తేజునొందుఁలి ♦ లోఁగిలికింజని చూచిరప్పడుకన్. ౧౬౧

సీ. మంచిగంధపుకోర ♦ మరిజాలవల్లిక
వట్టివేళ్లసురంటి ♦ వన్నెగదుర
జవ్వాదిపక్కణి ♦ సంపెంగినూనె గిం
డులుఁపిల్లిగడ్డలు ♦ తళతళమను
సిరిమించు రతనాల ♦ చిలుకల దివ్వెకం
బంబులు కప్పురఁ ♦ బరణివచ్చి
కస్తురిపెట్టెయు ♦ కాళంజికడిగల
పన్నీటిక్రోవియు పసిఁడిపీట

గీ. బలితమగునేన్ను వలుఁతోటి ♦ పనిదనర్చు
దువ్వెనక డానిచెంబులు ♦ నివ్వటిలిన
పడుకటిలుఁజూచి కన్నెల ♦ పండువైన
వచ్చరామెట్లుఁగలపూల ♦ పాన్పుఁజేరి. ౧౬౨

శా. దయ్యంబొఁకటివేల్పు కుబ్జమెదనే ♦ దందీర కేల్దమ్మితో
నొయ్యారంబు నకౌఁగిలించి తమితో ♦ నోజన్నునుం బల్కులన్

వెయ్యార్లాడుచు సోబియంబు గులుక ♦ న్వేఁదిమ్యవిద్దారిమేల్
కయ్యంబున్వివరింప మెచ్చుకొనియె ♦ న్గాదారి మాదారిలోన్.

క. పొక్కిలిచన్గవ కుత్తుక
చెక్కిలికెమ్మోవి కనులఁ ♦ జెల్వపుమోమున్
నిక్కువముగ ముద్దులుఁగొని
చక్కఁగ తమయిచ్చసుగముఁ ♦ జరిపెను తలలో. ౧౬౪

చ. సరిపయికూటమిం జెలువ ♦ సల్పుచునుండఁగ వింతవేలుపుం
దెరవసియాడె చుక్కలొగి ♦ తిన్నసవీప్వడి చిక్కలొందె సం
బరమున గట్టులున్వడికె ♦ బల్మెరుచందురుఁగప్పె (మబ్బుల
చ్చెరువుగనీరుబొట్లువడి ♦ సెన్మెతిమించులుమించెనాడుచున్. ౧౬౫

తే. గీ. ఇటుల పలువితాల ♦ హెచ్చుగ వలపుల
కలయికలనుఁ దేలి ♦ కలికికతియు
మేనివేల్పుతోడ ♦ మెత్తని నుడువుల
చెంగనాలుఁదాను ♦ జేసిపలికె. ౧౬౬

తే. గీ. నీదుచిట్టంటువుల చేత ♦ నీదుమేని
వలపులకు నాదుడెందంబు ♦ వరగలించె
నన్నికోరికలీయక ♦ న్నయ్య తగును
వేరువేలుపు లిట్లుగా ♦ వింపఁగలరె. ౧౬౭

మ. లలియా నీయొడలిం దలంచి సిరివా ♦ లాయంబు నిన్వేఁడు కొం
దులకో నేనిముసంబు నిన్నువిడువన్ ♦ తోరంపు పూవిల్తు విం
దులలోనిండిన వేడ్కఁజూపి వలపు ♦ ల్దోర్లియంగ నీకల్మికిన్
దులలేదే వివరింపగా నలవియే ♦ తోడ్తోడ నీ సత్తువన్. ౧౬౮

తే. గీ. కానవే గోరుకోర్కెలఁ ♦ గలుఁగఁజేసి
మనుపుఘుని వేడుకొనెనన ♦ మారుపాటు
నొందియడిగిన కుబ్జను ♦ డెంకమంపు
కజ్జిమునుమఁడు రుసికి న ♦ క్కజముఁగననె. ౧౬౯

ఆ. వె. పోఁడతిండి తపసి ♦ మొదలుగాగల రుసు
లెదనుఁదలఁచి చూడ ♦ కుదురులేని
వేల్పు నెట్లుగోరె ♦ వెలఁదుక విరివిల్తు
పోరఁగవయు నట్టు ♦ లోఁడుసిలలి. ౧౭౦

క. దొరకఁడు సిరికౌఁగిటిలో
దొరకండలఁ జోగికలువ ♦ దొరలకు నెపుడున్
దొరకఁడు వేల్పులకైనను
దొరికెన్వలరాయు తండ్రి ♦ తొయ్యలికి నొగిన్ ౧౭౧

క. తొలిచదువుల కందసియా
తొలిమాసిసి జేజెజేజె ♦ దొరికిన యంతన్
దెలివిఁగల ముఁగితిఁగోరక
వలరాచ పవిన్నెలంగ ♦ వలెనని గోరెన్. ౧౭౨

ఆ. వె. పిల్లతనములోన ♦ పెంచిన తల్లిచే
కట్లుబడిన యట్లు ♦ కనికరమున
లేమకౌఁగిలింత ♦ లోమిన్నయైఁ జిక్కె
నేమిపునెమొ తొల్లి ♦ నోములేనొ. ౧౭౩

ఆ. వె. ముజ్జగంబులేలు ♦ ముప్పొకలానిని
కోరుకున్న చెలికి ♦ కోర్కెలిచ్చి

గాచుకొననొ లేక ♦ కసటునకుంచెనొ
తెలియఁబలుకు మనిసఁ ♦ దిరిగినుడివె. ౧౭౪

ఉ. నీవనుమాటలన్నివిని నిక్కము ♦ బత్తుఁబత్తి నెడ్డతో
గావఁగ నీవెయంచనెడు ♦ కర్సకమున్నివిని నఁతలోవలన్
బోవకయుండునే యతని ♦ బుద్దినిగల్గిన కోర్కెలీయకే
దేవరయుండు నేమనకు ♦ తెల్లముగావలవేల్పు చెయ్దముల్. ౧౭౫

ఆ. వె. ఔరవాని చెట్ట ♦ నమరఁగఁ బట్టిన
గొల్లకన్నెకలునుఁ ♦ గొనిరి ముగితి
యతడు కేలబట్టి ♦ నతముఁబ్రోచెడు వారి
కరయ కలుసమన్న ♦ నలనుఁగలడె. ౧౭౬

ఆ. వె. చుట్టమయ్యెఁగాని ♦ నూడు చేతనుగాని
కలఁతనైనఁగాని ♦ కలసిఁగాని
బగితినైనఁగాని ♦ బల్మారువానితో
పొందుసేయఁగలుఁగు ♦ ముందు ముగితి. ౧౭౭

క. మునుకలవమియ్యతనుదా
ల్చిన ప్రేముడిపెను కులాడ ♦ చినిమగపనిలో
తనిననుండు మటంచని
వినిపించిన నంతసించి ♦ వెన్నుడువేడ్కన్. ౧౭౮

ఉ. కోరినకోర్కె లిత్తునని ♦ కుబ్జకువెన్నుఁడు నిండువేడ్కపెం
పారఁగ బల్సుగంబులను ♦ హొళిసెలంగఁగ గబ్బిగుబ్బలన్
బోరున నంటకౌఁగిలిడి ♦ పూవిలుకాని దురంబునైనమున్
మీరలచాలఁ దెల్పిచెలి ♦ మిన్నసుఁగూడి పదుండె నంతటన్. ౧౭౯

చ. కలువలు మోముమూసె కడ ♦ గండ్లకు తావగు చందమామపు
ల్గులమదిరోసె, జక్కవల ♦ గోడులఁబోవిడి గ్రేణిసేసె చు
క్కలగమిమాసె, తామరలు ♦ క్రన్నఱఁబాసె, బిరానకోడిగుం
పులుఁ దమిఁగూసె పక్కులట ♦ పోణిమిచెట్లనుఁబాసె నంతటన్.

మ. కులుకున్నిద్దపు చెక్కులన్మొనయు ♦ నొక్కుల్ వేసలిన్రాచిత
మ్ముల మల్తాపుకిలించి బోకముడులం ♦ బొంకంబుగా గట్టిని
చ్చలు సొంపొందఁగ ముంగురుల్నిమిరియి ♦ చ్చన్గంకిముం గోరన
త్తలబీతిన్వీరి పాన్పులండిగిరి తేం ♦ డ్లంచాలులేయంచొగిన్. ౧౮౧

తే. గీ. పాయమును గల్గుతమ్మిమే ♦ బ్రాయని మది
మెచ్చిరే రాజువినుచెలి ♦ మిన్నముదుక
డనుచు క్రిందుగ బడద్రొబ్బి ♦ నట్లుమామ
పాలెపడమటి కొండపై ♦ బాజులెడలి. ౧౮౨

క. గందపు మలనెత్తమ్ముల
కందువమేత్తీవయిండ్ల ♦ కడివిరి పాన్పున్
జెంది సుగించిన చెంచుల
యందపుచన్గవ జవాది ♦ యుంది సురలొగిన్. ౧౮౩

క. తారాడుచుండ పజలను
కూరుకు విడనాడి మేలు ♦ కొనుటకు తానే
కోరికలేపెడు వాడన
తూరుపుఁదెస వేఁగుజుక్క ♦ తురుతునఁ బొడిచెన్. ౧౮౪

తే. గీ. బమ్మచారులు మొదలైన ♦ బాపలెల్ల
మేలుకాంచి సతంబును ♦ మెలఁగదగిన

సేశలను తానమాడిము ♦ సేమమలర
సంచెగిడిగిళ్లు సలిపిరి ♦ సరిఁగబగితి.　　౧౫౫

తే. గీ. చెలియకుబ్జను కన్నెఱ్ఱ ♦ చేరిమరుని
రంతులనుదెల్పి నిమరించె ♦ రాఁజెలఁగ
మేలుకొలుపఁగఁ దగునని ♦ మించివచ్చి
కొక్కెరకొయుంచు కోళ్లటఁ ♦ కూసె పెలుచ.　　౧౫౬

ఆ. వె. వినుతకొడుకుఁ గలఁగ ♦ వెలసిన యరదము
తోడసిరివెలుంగ ♦ తొడరుబాయ
నందితూర్పు కొండ ♦ నలరె ముప్పొకల
తారుచున్న వేల్పు ♦ తళుకులెసఁగ.　　౧౫౭

ఆ. వె. ప్రొద్దుఁబొడువ తమ్మి ♦ పొక్కిలి మేల్కొని
తానమాడుపనుల ♦ తమకమునను
దీర్చి సుగముఁగదుర ♦ తిరుగుచు లేకల
గమినిఁబ్రోచుచుండె ♦ గారవమున.　　౧౫౮

చ. కుమరితయైన కుబ్జమెదఁ ♦ గోరినయట్టుల వెన్నుఁదొంగ వ
చ్చి మరులుమాన్పి యింటఁబసఁ ♦ జేసిసకోమలు డెంతొపెద్దవే
డ్కనుది జెలంగ బత్తికెయి ♦ కొరును గద్చుచు సంతసించియుం
డె మరుని గన్నతండిరిక ♦ డిందగు వేసులనెంచి నెమ్మిగన్.౧౫౯

మ. సనకుండు న్మొదలైన జోగులెదలో ♦ సంతోసముంజెంది చూ
చినఁ గానంబడనట్టి వేల్పునకుఁ దా ♦ చేనమ్ములం గల్గుచ
క్కని గందంబుల నిచ్చినందులకు వే ♦ గన్వచ్చి మన్నించె గ్రొ
న్ననవిల్తారిగలంచి నెల్తుకనురా ♦ నంగొన్ని నాళ్ళుండియున్.౧౬౦

చ. ఇటువలె కుబ్జవెన్నునకు ♦ నేడ్తెఱఁబొనిసె చెయ్వులెల్లయూ
రటఁగొనకే యొనర్చుచుత ♦ రల్పగ సత్తువలేనిబాగముల్

బటువుగనొంది పాటలర ♦ వాళులు హెచ్చఁగ సెజ్జగీములో
చిటిపొటిమాట లన్నొగని ♦ చిక్కనిరంతులఁ జిక్కియుండఁగన్.

క. ఏ వేసట లేకుండఁగ
పూవిల్తుని పోరులోనఁ ♦ బూవిల్తునకున్
బూవిల్తుఁడైన కన్నయ
తో వేకనుండె కొడుకు ♦ తొరలుట కొఱకై. ౧౯౨

సీ. కన్నయ్యనిబ్బరి ♦ కప్పుఁజూపులో కుబ్జ
పడఁతికి దనయొక్క ♦ పాలువలన
మంచికారున నెల ♦ మసలెనుగొంతికి
మోమున తెలుపెక్కె ♦ ముదుతవిప్పె
బొజ్జను తడఁబడె ♦ బుడిబుడి నడుకలు
కోర్కులు మెండయ్యె ♦ కులుకులెడలె
బోనముపై యిచ్చ ♦ బొత్తిఁగ లేదయ్యె
చిట్టుముల్బలిసెను ♦ చిట్టుకముఁగ

గీ. వంగడము నిల్చుటకు నయి ♦ వరలుచున్న
కొమరితనుఁ జూచి కమలియు ♦ కోమలుండు
నంతసంబను సంద్రము ♦ నొంతొనోల
లాడిరి నెలంత వేవిళ్ల ♦ తోడ మెలఁగె. ౧౯౩

వ. ఇట్లు తొమ్మిది నెలలు జరుగునంత నొక్కసోబన మూరుతమ్మున గాములు తమతమ సొంతపుతావులను మూడాకువదనకొండ వతానకంబుల కొందరుండ నొక్కకొమారుండుఁ గలిగె నతనికి పెద్దల నొడబాటుచే నువశ్లోకుండను పేరుతో నలరారె వాఁడుఁ దన తండిరియైన కన్నయ్య యడుగుఁదమ్ములఁ గొలుచుచు నార్వేరపురుసిచందురునకుఁ జట్టై బానిసముఁ గావించుచు మిక్కిలి·

యక్కజంబుగాఁ దెలియందగిన తెలివినిఁ దెలిసి యతం డాఁడు వారిని నాలవకొలంబువారిని బానిసె మొదలగు పజలనుఁ జక్కఁ జేయఁదగినదియై మిక్కిలి తలంచినంతనే ముగితిం గలుఁగనేయు నట్టి (సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతి) యనెడు పొత్తముఁగలిగించె. నదిమొదలు నేటివరకు కన్నయ్య బగితిఁగలవారికి విడువ రాని పాడియై నలరారె. కావున నీ కతరతనము నేరికైననుడివిన నుడువగవినిన చెప్పించిన బాగెసుఁగలవారికి వెన్నుండున్న మొల్నాడు గలుగును. ౧౯౪

ఆ. వె. అనుచు శుకుడుకట్టి ♦ మనుమనికిని కుబ్జ
కతను నునువులైన ♦ కమ్మనైన
నుడువులడరఁజెప్పె ♦ కడు పరిక్షింత్తుండు
చెవులు చవులునొంద చెలఁగిదెలిసె. ౧౯౫

క. సోబనములు నరసింగా
సోబనములు వేల్పుగొండ ♦ సుద్దిగలబసా
సోబనము లచ్చితేడా
సోబనములు వేల్పుపెద్ద ♦ చూలిపొగడ్తా. ౧౯౬

చ. అడుగులజాలుకుందనపు ♦ టందపుసాలుకడిందిముత్తికం
బాడవగుప్రోలుతమ్మినెల ♦ వుంగలనెల్తుకయాలుఁబత్తులం
గడువడిఁబ్రోచుకేలుబరి ♦ గండడగించెడు చుట్టువాలుమై
బెడగుల మబ్బుడాలు గల ♦ ప్రెగ్గెడరక్కసిమాత్తిసింగమా. ౧౯౭

(తోటకవృత్తము)

తొగకంటువు కం ♦ దుడు దేవరలు
న్బొగడ నృతనం ♦ బుల సోఁడిమనం
దగు వేలుపు గొం ♦ డను తానకమై
మిగుల న్వెలిఁజిమ్మ ♦ న మేల్బిరుదా. ౧౯౮

(౧౯౬౯ విక్రమార్క-శకం)

క. కనవమ్మణ్ణ వశశిసం
ఖ్యనిగుడఁగల విక్రమార్క ♦ హాయనమున సా
గెనుకీలకమాఖ సితచతు
ర్థీ-నినీకవితను ముగించి ♦ తిని మెచ్చ బుధుల్. ౧౯౯

(గద్య.)

ఇది శ్రీమద్రమాంగనాంగ మందారలతోత్తుంగ స్త న స్తబకస్థిత
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘుల్ చక్రవర్తుల రంయ్యాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతంబైన
అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసం
బను సింగారకబ్బంబు నందు
తృతీయాశ్వాసము సర్వం
సంపూర్ణం శ్రీకృష్ణ
పరబ్రహ్మణేనమః
శ్రీమతేరా
మానుజా
యన
మః
శ్రీ